# ధనుర్మాస వ్రత
# మంగళాశాసన క్రమము



ముముక్షుజన మహాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ యతీంద్రులు నిర్వహించు ధనుర్మాస మహావ్రతమున అనుష్ఠింపబడు మంగళాశాసన క్రమము :

శ్రీ యతీంద్ర ప్రచురణలు
గంజాంవారి వీధి :: కాకినాడ.

ద్వితీయ ముద్రణ :
ప్రతులు వేయి :

కాళయుక్తి-మార్గశిర
శుద్ధ పాడ్యమి :
1-12-78

వెల : ఒక రూపాయి

ముద్రణ :
'ముముక్షువు'
[illegible] ప ఊా ర.

# విజ్ఞాపన

భక్తి సంప్రదాయంలో — అందునా వైష్ణవ ధర్మంలో — ధనుర్మాసవ్రతానికి ఒక విశిష్టత ఉంది. ద్వాపరాంతంలో గోపికలు చేసిన వ్రతం ఇది. ఆ గోపికలను ఆదర్శంగా ఉంచుకొని, అంతేకాదు, తానే ఒక గోపెమ్మ అయి, ఈ వ్రతం ఆచరించటమేకాక, వ్రతస్వరూప నిరూపకంగా, వ్రతలక్ష్యనిదర్శకంగా, వ్రతఫలానుభవ నిర్వర్తకంగా — 'తిరుప్పావై' అన్న పేర ఒక రసధునిని అనుగ్రహించింది విష్ణుచిత్తుల ముద్దుబిడ్డ గోదాదేవి. అసంఖ్యాక భక్తగణం అనుష్ఠిస్తున్నారు ధనుర్మాసవ్రతం. అయితే, ముముక్షుజన మహాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ సీతారామ యతీంద్ర గురుదేవులు ఈ ధనుర్మాసవ్రతంలో మంగళాశాసన కార్యక్రమాన్ని భక్తజన మనోరంజకంగా తీర్చిదిద్ది, ఒక ప్రత్యేకత సంతరించారు దానికి.

సాధనలోనూ, అనుభవంలోనూకూడా వ్యష్టితత్త్వాన్ని నిరసించి, సమష్టి తత్త్వానికి పట్టంకట్టటం ధనుర్మాసవ్రత విశిష్టతల్లో ఒకటి. మంగళాశాసన కాలంలో అర్చనచేసేవారు హారతిఇస్తూ, తక్కినవారు వాచిక కైంకర్యం మాత్రం చేయటంకాక, గోష్ఠిలోని సర్వులూ చేతులలో హారతులు పుచ్చుకుని, మనస్సు లగ్నంచేసి, మంగళాశాసన శ్లోకాలూ, కీర్తనలూ అన్నీ పాడుతూ త్రికరణశుద్ధిగా సమష్టిగా అనుష్ఠించేట్లు తీర్చిదిద్దారీకార్యక్రమాన్ని విష్ణుచిత్తులవారి అడుగుజాడల్లో. తక్కిన అంశాలకంటె దీనికి కల ప్రాధాన్యానికి సూచకంగా సుమారు మూడు గడియలకాలం దీనికి ప్రత్యేకించారు.

ధనుర్మాసవ్రతం శ్రీవారి సన్నిధిలో అన్వయించుకొనే భక్తులూ, శ్రీవారి ఆదర్శాన్ని అభినందించి ఆచరించగోరే భక్తులూ ఎందరో కోరినందున — ఈ మంగళాశాసన క్రమాన్ని ఇలా ప్రచురించి భక్తుల కరకమలాల్లో సమర్పిస్తున్నాం. ఆదరించే బాధ్యత అందరిదీని.

వల : మార్గశీర్ష
శుద్ధ ప్రతిపత్ :
22-11-78

— సంపాదకులు.

## ధనుర్మాస వ్రతానుష్ఠానంలో :

తెలవారుజామున -

మూడు గంటలకు : సుప్రభాతగోష్ఠి.

భగవదర్చన.

నాలుగు గంటలకు : సమష్టి అనుష్ఠానము.

అయిదు గంటలకు : సేవాకాలము.

ఆరు గంటలకు : నివేదనము ;

ఆరు గంటల
పదిహేను నిమిషాలకు : మంగళాశాసనము;

అనంతరం తీర్థప్రసాద వినియోగము

## ధనుర్మాస వ్రత
## మంగళాశాసన క్రమము

స్వామికి కర్పూరహారతి
సమర్పించుచు –

*అన్ఱివ్వులగమ్ అళన్దాయ్ ! అడిపోత్తి
శెన్ఱఙ్గుత్తెన్నిలజ్గై శెత్తాయ్ ! తిరల్ పోత్తి
పొన్ఱచ్చగడమ్ ఉదైత్తాయ్ ! పుగళ్ పోత్తి
కన్ఱు కుణిలా ఎఱిన్దాయ్ ! కళల్ పోత్తి
కున్ఱు కుడైయా ఎడుత్తాయ్ ! కుణమ్ పోత్తి
వెన్ఱు పగై కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోత్తి
ఎన్ఱెన్ఱున్ శేవగమే యేత్తిప్పఱైకొళ్వాన్
ఇన్ఱుయామ్ వన్దోమ్ ఇరఙ్గేలో రెమ్బావాయ్.

---

* ఈ గుర్తుకలవి రెండుమార్లు పఠింపవలెను.

*మున్నొక శుభ వేళ ముల్లోకములను
కొలిచిన శ్రీపాదములకు మంగళము !
భీకర పాథోధి వేల్లిత దుర్గ
లంకను చేరి విలాస మాత్రముగ
దుష్ట రాక్షసజాతి తుదముట్ట దునుము
నీ బాహుశక్తికి నిత్యమంగళము !
శకట బంధమ్ము లుత్సన్నముల్ కాగ
చివురుగాలను తన్ని చెర్లాడినట్టి
నీ యశస్సునకును నిత్యమంగళము !
ఒడిసెల రాదువ్వ నుదుటున వత్స
దనుజు రువ్వి కపిత్థ దానవు కూల్చు
నీదు పాదమునకు నిత్యమంగళము !
గోవర్ధనము వెల్ల గొడుగుగా బట్టు
నీ గొనమ్మునకును నిత్యమంగళము !
పగతుర నిశ్శేషముగ నురుమాడు
నీబల్లెమునకును నిత్యమంగళము !
పలుమారు నిన్నిట్లు ప్రస్తుతిసేయ,
పురుషార్థ పటహమ్ము పొందగ నేడు
అరుదెంచితిమి మమ్ము కరుణింపుమయ్య !
మననోము జగతికి మంగళప్రదము.

**అవకాశము ఉన్నవారు మొత్తము కర్పూరహారతియే ఈయవచ్చును. అట్లు అవకాశములేనివారు ఇక్కడ నుండి ఆవునేతితోగాని, ఆవునేయి కలిపిన నేతితోగాని, నువ్వులనూనెతోగాని వెలిగించిన హారతిఈయవచ్చును.**

లక్ష్మీ చరణ లాక్షాంక సాక్షాత్ శ్రీవత్సవక్షసే
క్షేమంకరాయ సర్వేషాం శ్రీరంగేశాయ మంగళమ్॥

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేఽర్థినాం
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

అస్తు శ్రీ స్తన కస్తూరీ వాసనా వాసితోరసే
శ్రీహస్తి గిరినాథాయ దేవరాజాయ మంగళమ్ ॥

కమలా కుచ కస్తూరీ కర్దమాంకితవక్షసే
యాదవాద్రి నివాసాయ సంపత్పుత్రాయ మంగళమ్ ॥

నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే
సుభద్రా ప్రాణ నాథాయ జగన్నాథాయ మంగళమ్ ॥

వేదాంత ప్రతిపాద్యాయ వాసుదేవాయ విష్ణవే
రాజీవదళనేత్రాయ లక్ష్మీనాథాయ మంగళమ్ ॥

వేదామృతాబ్ధి చంద్రాయ కళ్యాణ గుణరాశయే
ముత్తివివంశ భాగ్యాయ లక్ష్మీనాథాయ మంగళమ్ ॥

నారాయణాయ నిత్యాయ హరయే పరమాత్మనే
పెద్దముత్తివి వాసాయ లక్ష్మీనాథాయ మంగళమ్ ॥

బ్రహ్మాది స్తంబపర్యంత సర్వలోకైక సాక్షిణే
శ్రీభూనీలా సమేతాయ వైకుంఠేశాయ మంగళమ్ ॥

శ్రీ సీతారామ యోగీంద్ర హృదయాబ్జ విహారిణే
సర్వలోక శరణ్యాయ వైకుంఠేశాయ మంగళమ్ ॥

పెద్దముత్తివి గ్రామస్థ భక్తసంరక్షణేచ్ఛయా
ధరణ్యా మవతీర్ణాయ వైకుంఠేశాయ మంగళమ్ ॥

శ్రీమల్లక్ష్మణ యోగీంద్ర హృన్మందిర విహారిణే
శ్రీగోదా ప్రాణనాథాయ శ్రీరంగేశాయ మంగళమ్ ॥

శ్రీ మహాపూర్ణ యోగీంద్ర హృదయోల్లాస హేతవే
సత్యసూరి సమేతాయ వేంకటేశాయ మంగళమ్ ॥

శోభనాద్రి నివాసాయ శోభితార్థ ప్రదాయినే
రాజ్యలక్ష్మీ సమేతాయ నారసింహాయ మంగళమ్ ॥

శ్రీశాయ శ్రితకల్పాయ కారుణ్య రససింధవే
శ్రీసింహాగిరినాథాయ క్రోడరూపాయ మంగళమ్ ॥

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

వేదవేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్ ॥

ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా
రాజాధిరాజ రాజాయ రామభద్రాయ మంగళమ్ ॥

పరివార సమేతాయ కృష్ణాశ్రమనివాసినే
నిత్యం పట్టాభిరామాయ భూయోభూయోఽస్తు మంగళమ్ ॥

అస్తు గోపాలబాలాయ నిత్యాయ పరమాత్మనే
భక్త వాత్సల్యనిధయే నిత్యభోగ్యాయ మంగళమ్ ॥

మంగళం గోపబాలాయ కళ్యాణగుణరాశయే
గోపవర నివాసాయ రుక్మిణీశాయ మంగళమ్ ॥

జీవాతవే త్రిజగతాం దివ్యజ్ఞాన ప్రదాయినే
కృపాంబునిధయే నిత్యం గీతాచార్యాయ మంగళమ్ ॥

శ్రీమతే పక్షిరాజాయ స్వర్ణపక్షాయ ధీమతే
వైకుంఠనాథ వాహాయ వైనతేయాయ మంగళమ్ ॥

మంగళం వాయుపుత్రాయ భక్తపాలాయ మంగళమ్ ॥
మంగళం భక్తినిధయే రామదూతాయ మంగళమ్ ॥

హనుమతే హరీశాయ జానకీ దుఃఖహారిణే
కృష్ణాశ్రమ నివాసాయ రామదూతాయ మంగళమ్ ।

స్వోచ్ఛిష్టమాలికాబంధ గంధబంధుర జిష్ణవే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్య మంగళమ్ ॥

మాతృశాకించనత్రాణ బద్ధకంకణ పాణయే
విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్య మంగళమ్ ॥

శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే
శ్రీతింత్రిణీమూలధామ్నే శఠకోపాయ మంగళమ్ ॥

శ్రీపరాంకుశ పాదాబ్జ సురభీకృతమౌళయే
శ్రీవత్సచిహ్ననాథాయ యతిరాజాయ మంగళమ్ ॥

శేషోవా సైన్యనాథోవా శ్రీపతిర్వేతి సాత్త్వికైః
వితర్క్యాయ మహాప్రాజ్ఞై ర్భాష్యకారాయ మంగళమ్ ॥

తులామూలావతీర్ణాయ తోషితాఖిలసూరయే
సౌమ్యజామాతృమునయే శేషాంశాయాస్తు మంగళమ్ ॥

శమాది గుణయుక్తాయ జ్ఞానవైరాగ్య మూర్తయే
శిష్య వాత్సల్యపూర్ణాయ సంపత్ప్రతాయ మంగళమ్ ॥

శ్రీ శాంఘ్రిపద్మ భృంగాయ జ్ఞానభక్తి ప్రదాయినే
శ్రీ శ్రీ సంపత్కుమారాయ యతిరాజాయ మంగళమ్ ॥

మంగళం భిక్షురూపాయ తత్త్వ విద్యాప్రదాయినే
సీతారామ యతీంద్రాయ దేశికేంద్రాయ మంగళమ్ ॥

మంగళం సచ్చిదానంద స్వరూపాయ మహాత్మనే
సీతారామ యతీంద్రాయ దేశికేంద్రాయ మంగళమ్ ॥

సంపత్కుమారశిష్యాయ జ్ఞానభక్తి స్వరూపిణే
సీతారామ యతీంద్రాయ దేశికేంద్రాయ మంగళమ్ ॥

మంగళం అవధూతేంద్ర ! మంగళం శ్రీసరస్వతి !
మంగళం విశ్వగారాంగ ! మంగళం శుభమంగళమ్ ॥

శ్రీమద్భక్తజనాధీన హృదయాయ మహాత్మనే
శ్రీ లక్ష్మణ యతీంద్రాయ దేశికేంద్రాయ మంగళమ్ ॥
సీతారామ యతీంద్రశ్రీ పదాబ్జేందిందిరాయచ
శ్రీ లక్ష్మణ యతీంద్రాయ దేశికేంద్రాయ మంగళమ్ ॥

హరినామామృతాస్వాద రసనిర్భర రూపిణే
శ్రీ లక్ష్మణ యతీంద్రాయ దేశికేంద్రాయ మంగళమ్ ॥
మంగళాశాసనపరై ర్మదాచార్య పురోగమైః
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు
మంగళమ్ ॥

ఒక పళ్ళెరములో పుష్పములు, తులసి ఉంచి రెండు చేతులతో పట్టుకొని, మంత్రపుష్పము అనుసంధించి, అనంతరము క్రింది మంత్రములు చెప్పుచు ఆయా మూర్తులసన్నిధిలో పుష్పములుసమర్పించవలయును.

నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి,
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ॥

దాశరథాయ విద్మహే, సీతావల్లభాయ ధీమహి,
తన్నో రామచంద్రః ప్రచోదయాత్ ॥

దామోదరాయ విద్మహే, గోపాలాయ ధీమహి,
తన్నః కృష్ణః ప్రచోదయాత్ ॥

తత్ పురుషాయ విద్మహే, గోదావల్లభాయ ధీమహి,
తన్నో రంగనాథః ప్రచోదయాత్ ॥

తత్ పురుషాయ విద్మహే, శ్రీనివాసాయ ధీమహి,
తన్నో వేంకటేశః ప్రచోదయాత్ ॥

లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురామ్
శ్రీమన్మంద కటాక్షలబ్ధవిభవ బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే
ముకుందప్రియామ్ ॥

మహాదేవ్యైచ విద్మహే, విష్ణుపత్న్యైచ ధీమహి,
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

నీళాతుంగ స్తనగిరితటీ సుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిర స్సిద్ధ మధ్యాపయన్తీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యాబలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయఏవాస్తు భూయః ॥

విష్ణుచిత్త తనూజాయైచ విద్మహే
రంగనాథ మహిష్యైచ ధీమహి
తన్నో గోదా ప్రచోదయాత్ ॥

పక్షిరాజాయ విద్మహే, స్వర్ణపక్షాయ ధీమహి,
తన్నో గరుడః ప్రచోదయాత్ ॥

ఆంజనేయాయ విద్మహే, వాయుపుత్రాయ ధీమహి,
తన్నో హనుమాన్ ప్రచోదయాత్ ॥

రామానుజాయ విద్మహే, భాష్యకారాయ ధీమహి,
తన్నో యతిరాజః ప్రచోదయాత్ ॥

సంపత్పుత్రాయ విద్మహే, యద్వద్రీశాయ ధీమహి,
తన్నో యతిరాజః ప్రచోదయాత్ ॥

సీతారామాయ విద్మహే, దేశికేంద్రాయ ధీమహి,
తన్నో యతీంద్రః ప్రచోదయాత్ ॥

నామరూపాయ విద్మహే, సత్యశీలాయ ధీమహి,
తన్నో అవధూతః ప్రచోదయాత్ ॥

*శి త్తమ్ శిఱుకాలే వన్దు ఉన్నై చ్చేవిత్తు
ఉన్ పొత్తామరై యడియే పోత్తుమ్ పొరుళ్ కేళాయ్
పె త్తమ్ మేయ్ త్తు ఉణ్ణుమ్ కుల త్తిల్ పిఱన్దు
నీకు త్తేవల్ ఎజ్గళై, క్కొళ్ళామల్ పోగాదు
ఇత్తైప్పఱై గొళ్వాన్ అన్తుకాణ్ గోవిన్దా !
ఎత్తైక్కుమ్, ఏళేళు పిఱవిక్కుమ్, ఉన్దన్నోడు
ఉత్తోమే యావోమ్ ఉనక్కే నామ్ ఆట్చెయ్వోమ్
మత్తనమ్ కామజ్గళ్ మాత్తేలో రెంబావాయ్ ॥

*వజ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
తిజ్గళ్ తిరుముగత్తు చేయిళై యార్ శెన్ఱు, ఇఱైఞ్జి
అజ్గప్పఱై క్కొణ్డవాత్తై, అణిపుదువై
పైజ్గమల త్తణ్ తెరియల్ పట్టర్ పిరాన్ క్కోదై శొన్న
శజ్గ త్తమిళ్ మాలై ముప్పదుమ్ తప్పామే
ఇజ్గు ఇప్పరిశు ఉరైప్పార్ ఈరిరణ్డు మాల్వరై త్తోళ్
శెజ్గణ్ తిరుముగత్తు చ్చెల్వ త్తిరుమాలాల్
ఎజ్గుమ్ తిరువరుళ్ పెత్తు ఇన్బుఱువ రెమ్బావాయ్ ॥

*తెలవారకయు నీదు దివ్యసన్నిధికి
అరుదెంచి సొగసైన అడుగుదామరల
జయమని మంగళాశాసనమ్ములను
పచరించుటనుగల భావమ్ము వినవె !
దయయుంచి తీర్చు ఉదారత కనవె !
పసుల కాపరులౌచు బ్రతికెడి గోప
కులమున నుదయించి విలసిల్లు నీవు
మాయొనరించెడి నీ యంతరంగ
కైంకర్యములుగొన కాదననౌనె !
వ్రతమునకై మేము ప్రార్థించినట్టి
వాద్యమ్ములిచ్చుటే వాసిగాదయ్యా !
అంతటితో మేము సంతసింపమయ !
మావిన్నపము విను గోవిందదేవ !
ఏడేడు జన్మల కేనాటికైన
నిత్య సంబంధమ్ము నీతోడకలుగ
మాదు సేవలు నీకుమాత్రమే కాగ
నీ అనుగ్రహమున నెగడెద్దు గాత !
వేరు వాంఛలు మాకు నీరాను గాత !
నందాత్మజాత ! ఆనందప్రదాత !
ఘననోము జగతికి మంగళప్రదము !

*అంల గాపెలు చక్క నల్లలారగ
పాలమున్నీటిని లీలగా త్రచ్చి
మామనోహరు కేశిమర్దను చేర
నిండు చందురు గేరు నెమ్మోము లొప్ప
పుత్తడి తొడవులు పొంపిరివోవ
గోపకన్యలు వచ్చి శ్రీపాదములకు
ప్రణమిల్లి పురుషార్థముల పొందినట్టి
క్రమము ముప్పది పాశురములలో పాడె
ముద్దుగ ద్రావిడమున సూక్తిమాల
గోదమ్మ, తానొక గోపికయాచు-
పుడమి కలంకారభూతమై ఒప్పు
విల్లిపుత్తూరులో వెలసినవారు,
తమ్మిపూసల తావలమ్ములు దాల్చు
శ్రీవిష్ణుచిత్తుల చిన్నారిబిడ్డ;
ఇది శ్రద్ధ చదువువా రెవ్వరైన నెందు
చెందమ్మి కనుజంట సిరి నొప్పువాని
దివ్య ముఖాంభోజ తేజమ్ము వాని
పొంగొందలగు నాల్గు భుజములవాని
శ్రీనివాసునికృప చెన్నారగలరు!
ఆనందమున ఓలలాడంగగలరు!

## ఆణ్డాళ్ పాశురము రెండుమార్లు అనుసంధించవలెను.

కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥
నీళాతుఙ్గస్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయన్తీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయఏ వాస్తుభూయః ॥

కోదై పిఱన్దవూర్ కోవిన్దన్ వాళుమూర్
శోదిమణిమాడమ్ తోన్ఱుమూర్ నీదియాల్
నల్లపత్తర్ వాళు మూర్ నాన్మఱైగళోదుమూర్
విల్లిపుత్తూర్ వేదక్కోనూర్.

పాదగఙ్గళ్ తీర్క్కుమ్ పరమ నడి కాట్టుం
వేద మనైత్తుక్కుమ్ విత్తాగుమ్ కోదై తమిళ్
ఐయైన్దు మైన్దుమ్ అఱియాద మానిడరై
వైయమ్ శుమప్పదుమ్ వమ్బు ॥

తిరువాడిప్పూరత్తు చ్చెగత్తు దిత్తాళ్ వాళియే
తిరుప్పావై ముప్పదుమ్ శెప్పినాళ్ వాళియే
పెరియాళ్వార్ పెత్తెడుత్త పెణ్బిళ్ళై వాళియే
పెరుమ్బూదూర్ మామునిక్కు ప్పిన్నానాళ్ వాళియే
ఒరునూత్తు నాఱ్పత్తు మూన్ఱు రైత్తాళ్ వాళియే
ఉయర్ అరఙ్గర్ క్కే కణ్ణి యుగన్దళిత్తాళ్ వాళియే
మరువారున్దిరు మల్లివళనాడి వాళియే
వణ్పుదువై నగర్ క్కోదై మలర్ పదఙ్గళ్ వాళియే ॥

ఆముక్తమాల్యద అవతరించిన ఊరు
వటపత్రశాయి సేవలు చెలంగెడి ఊరు
భవన మణిప్రభా పటలి నొప్పగు ఊరు
ఆర్జవశక్తి మహాభక్తి కలఊరు
వేదముల్ నాల్గింట పెంపుగల్గిన ఊరు
విష్ణుచిత్తుల ఊరు విల్లిపుత్తూరు...

పాపముల్ బాపు, శ్రీపాదముల్ జూపు
వేదబీజమ్మగు గోదమ్మ పలుకు-
ముప్పది పాశురమ్ములు - నేరనట్టి
బ్రతుకు వ్యర్థము, భూమి భారమ్ము సుమ్ము !

పుణ్య కర్కాటమున పూర్వఫల్గుణిని
తులసితోటను పుట్టు చెలికి మంగళము !
ముప్పది పాశురమ్ముల దివ్యగీతి
పాడిన సౌభాగ్యవతికి మంగళము !
శ్రీ విష్ణుచిత్తుల చేతుల పెరిగి
గారాలుపోవు అంగనకు మంగళము !
శ్రీపెరుంబూదూరు జియ్యరువారి
చెలియలై విలసిల్లు చెలికి మంగళము !
నూటనల్వదిమూడు పాటల నొప్పు
కబ్బమ్ముకూర్చు అంగనకు మంగళము !
బ్రతుకెల్ల శ్రీరంగభర్త పాదముల
అర్పించుకొన్న ఆయమకు మంగళము !
భాగ్యవంతము మల్లివళ పురమందు
విలసిల్లునట్టి పైదలికి మంగళము !
పొల్పారు శ్రీవిల్లిపుత్తూరునందు
వెలసిన తల్లికి విజయ మంగళము !

౧

మంగళం జయమంగళం - మా-నల్లనయ్యకు మంగళం ॥
మంగళం శుభమంగళం-మా-నల్లనయ్యకు మంగళం ॥
జగములన్నియు గన్నతండ్రికి-చక్కనయ్యకు మంగళం ॥
శ్యామలాంగుని కోమలంపలి-సాముయురళికి మంగళం ॥
శిరమునందున నాగసుగుల్కెడి-శిఖిశిఖకు జయమంగళం ॥
కరుణారసమును చిందుచుండెడి-కన్నుదోయికి మంగళం ॥
వనజగరిమను ధిక్కరించెడి- వదన శోభకు మంగళం ॥
భక్తజనులకు కల్పతరువగు-బాహుయుగళికి మంగళం ॥
బహువిపులమై సిరిచెలంగెడి - వక్షసీమకు మంగళం ॥
ముజ్జగంబులు లోనగలిగిన - బొజ్జసొగసుకు మంగళం ॥
శంఖచక్రగదాది చిహ్నిత - చరణయుగళికి మంగళం ॥
గోపవరమున దయను వెలసిన - గోపవరునకు మంగళం ॥
యతిని సీతారాము నేలు దయాంబురాశికి మంగళం ॥

౨

మంగళం జయమంగళం పట్టాభిరామా మంగళం ॥
మంగళం శుభమంగళం కోదండరామా మంగళం ॥
చరణదాసుల ప్రేమపాలనసేయు ప్రభువా ! మంగళం ॥
శ్రితులకును తన్మయతకూర్చు - చిరునగవునకు మంగళం ॥
కాంతిపుంజము లీనుచుండెడి - శ్రీముఖమునకు మంగళం ॥

కరుణామృతపుజల్లు కురియుచుండెడి-కన్నుదోయికి మంగళం ॥
సిరిచెలంగెడి పెదదవక్షస్సీమకును శుభమంగళం ॥
ఆర్తులకు అభయం బొసంగెడి-హస్తయుగళికి మంగళం ॥
శంఖ చక్ర గదాది చిహ్నిత- చరణయుగళికి మంగళం ॥
దనుజులను దునుమాడెడి కోదండమునకు మంగళం ॥
అక్షయములైనట్టి తూణీరమ్ములకు శుభమంగళం ॥
శబరి నుద్ధరించిన సౌలభ్యగుణముకు మంగళం ॥
గుహునిబ్రోచిన ప్రేమపూరిత-హృదయమునకు మంగళం ॥
నీలమేఘశ్యామునకు శృంగారమూర్తికి మంగళం ॥
రఘువరాన్వయరత్నదీపము - రామచంద్రుకు మంగళం ॥

3

మంగళహారతిగొమ్మా ! మా
మనవి చేకొని వేగ మన్నించవమ్మా ! ॥మం॥
జగములన్నియు గన్నతల్లీ !- శ్రిత
జనులను కరుణించు జయకల్పవల్లీ ! ॥మం॥
~~అపరాధముల~~ పుట్ట నమ్మా !- న
న్నిపుడు దయజూచితే ఇకపుట్ట నమ్మా ! ॥మం॥
సురరాజ భవ విధు లెన్న- నీ
కరుణచేతనె వైభవ కలితులై మన్న ॥మం॥
కరుణామృతాంబుధివి గావా- నిన్ను
శరణంటి నన్బ్రోవ సరసునరావా ! ॥మం॥

దోసిలొగ్గితి తల్లి చూడు !- నా
దోసము లెన్నక కృపజూడు నేడు ॥మం॥
కరుణాలవ మిటు జిల్కవమ్మా !- ఇక మా
కార్యము లన్నియు గట్టెక్కెనమ్మా ! ॥మం॥
శ్రితజనులకు కల్పవల్లి !- సుతుని
సీతారామయతిని దయజూడు తల్లీ ! ॥మం॥

౪

మంగళ మని పాడరమ్మా !- శ్రీ
రంగనాథుని భామినిం గానరమ్మా ! ॥మం॥
జనియించె తులసీవనమున- భక్త
జనుల కామితము లొసగు నిదానమన ॥మం॥
పలుకుల నమృతము లొలుక- తిరు
ప్పావను గానము పాడిన చిలుక ॥మం॥
ముడిచి విడిచిన విరిసరుల- వరుని
మోహము నొందించే మురిపెంపు కురుల ॥మం॥
మగనిపై తమకముమీరి- గొల్ల
వగలాడివలె జేసె వ్రత మొక్కసారి ॥మం॥
వరణీయ సుగుణమతల్లి- శ్రీని
వాస దేశికుల భావముగన్నతల్లి ॥మం॥
పురుషోత్తమపురి సౌధ- భూమి
జేరి మమ్మేలు రక్షితాపరాధ ॥మం॥

౨౫

మంగళం బనుచు పాడరే ! ఆండాళు కెపుడు
మంగళం బనుచు పాడరే! ॥

మంగళం బనుచు పాడరె మగువలార ! వరవరపుర
రంగరమణరమణియైన మంగళాధి దేవతకును ॥మం॥
శౌరి కభిమతానురూపయై- నిరూపకత్వ
సారభావిత స్వరూపయై
నారములకునెల్ల పురుషకారమగుచు తగుచు నా
ద్వార శేషతయును ప్రాప్యపూరకత్వ మమరు సిరికి ॥మం॥
నేత కెపు డనన్య శేషయై- అనన్యశరణ
యై తదేకభోగ్య వేషయై
ప్రీతి నతని గలసి బ్రతికి భీతి నైన విరహరీతి
కేతరింపలేని యా తదేకనిర్వాహ్య కెపుడు ॥మం॥
జగములన్ని గన్నతల్లికి- దయాక్షమాది
సుగుణజాల యగు మతల్లికి
ప్రగుణ శేషగిరి సరాగ భర నృసింహ శఠజిదార్య
యుగళరత్నముకురములను సొగసుజూచుకొనెడి సతికి ॥మం॥

౭

భామలు మీరందరు మంగళమని-
పాడరె గోదాదేవికి !
పామరులను పాలింపగ నృహరి
గ్రామమందు కృపతో నెలకొన్నది ॥భా॥

నయనానందము నిడు నెలవంక-
నలినబాహు వన్నెలగోరింక
ప్రియతర భట్టపతి పెంచిన జింక
ప్రేమమించు మౌక్తిక తాటంక ॥భా॥
సుఖకరమగు శృంగారపుబొమ్మ
సొంపు తావి గల మరువపు రెమ్మ
సఖుడగు రంగని ముద్దులగుమ్మ
శౌరిపాణిలో నలరెడి నిమ్మ ॥భా॥
కుందనపుం దళుకుల శతకోటి
కొమవవేస్చు సద్గుణగణపేటి
మందహాస మింపొనరు వధూటి
మనవతీపరంపరలో మేటి ॥భా॥
శేషగిరిం జెలగెడి మణివల్లి
శ్రీనివాస దేశికులకు తల్లి
దోసములన్ గనుగొనని మతల్లి
దోసిటిలో నిండిన సుధవెల్లి ॥భా॥

౭

మంగళమని పాడరే! - ఆళ్వార్లకు- మంగళమని ఆడరే !
పరిమళ మకరంద పరమార్దవంబుల
సరససూక్తులయం దిరవుకొని
సుమచిర నిజజన్మ సూనుగుణంబుల
పేయ భూత కాసార మహదాహ్వాయులకు ॥మం॥

శ్రీశానుగుణ మంగళాశాసన కాము
నాసీనులగు భట్టనాథులకు
దేశికమణి భోగ్య దివ్యప్రబంధ స
మావేశులగు తనుమడిశై మాళ్వార్లకు ॥మం॥
అనిశము రంగనాథాభిముఖ్యము జూపి
మను కుల శేఖరఘనులకును
వినయ వివేకాదులను మించి రంగనా
థుని జెదియున్న శ్రీ మునివాహనులకు ॥మం॥
ఘనతర మాలికా కైంకర్య రచన దే
లిన భాగవత పాదరేణులకు
వనజాక్ష పాద సాధన సాధ్య భావ బో -
ధన షట్ప్రబంధ చింతన కలిహరులకు ॥మం॥
క్రూర దుర్మతాంధకారము లడగించి
మీరిన యతిరాజ సూరులకు
సారతరజ్ఞాన చరమార్థకారిత
కారులైన మధురకవి నాళ్వార్లకు ॥మం॥
పరభక్తి యుక్తులై భగవద్గుణాధార
పరులైన శ్రీ వకుళాభరణులకు
తురుమున దాల్చిన విరిదండ శ్రీరంగ
ధరణీశు కిడిన గోదానాంచార్లకు
సతత శ్రీవచనభూషణశాస్త్ర నిర్వాహ
మతులైన మనవాళమహామునులకు
యతిరాజాపర దివ్యావతరణ మన దోచు
గతిశూన్య శరణ లక్ష్మణయోగివరులకు ॥మం॥

నిరతము సంసారశరధిలోపల బడి
    దరిగానని అస్మదాదులను
కరుణించు శాల్మలికంఠపురాధీశ
    వరకీర్తియగు శ్రీనివాస దేశికులకు ॥మం॥

౨

తల్లులార ! మీరెల్లరు మంగళ
    హారతు లివ్వరె మన యతీంద్రులకు !
ఉల్లమలర ఘనులెల్ల జేలిపగ
    కొల్లగాను మన స్వామికి వేగమే ॥తల్లు॥
మందహాస చంద్రిక తెల్లెపల
    మంజుల మృదుతర భాషల మనల
రంజిల్లగసేయగ హృదయముల
    రమణమీర పదపద్మముల ॥తల్లు॥
వేమరు వేడిన వినగడలేక
    కామాదులు దరిచాపుకు బోమి
కలనైనను మరపునకును రామి
    సహజముగా గలిగిన మనస్వామి ॥తల్లు॥
కుటిలకుంతలజాల సుఫాలం
    కోటిసూర్యసమ తేజ విశాలం
కాషాయాంబర ధృత ఘనలీలం
    కమనీయ గుణాలంకృత శీలం ॥తల్లు॥

సేవకజన విజ్ఞానవితరణులు
భీకరభవభయతారక చరణులు
భక్తిరసామృత సరోవిహారణులు
భాస్కరదాస హృత్పంకజ రమణులు ॥తల్లు॥

౬

జయహారతి కృపాకరా లోకరక్షైక దీక్షాంకితా !
సాధుజన రక్షణ బిరుదాంకితా-ఓ
సాధుజనరక్షణ బిరుదాంకితా ॥జయ॥

భక్తవశంకరా హృత్పావనకరా సంతోష రత్నాకరా !
దేవా మము వేవేగ కాపాడవా-ఓ
దేవా మము వేవేగ కాపాడవా ॥జయ॥

దీనార్తిపాలనా దివ్యరూపసుందరా దేవాంశసంభూతా !
దిక్కునీవె దేవదేవ దయతో బ్రోవవా - నా
దిక్కునీవె దేవదేవ దయతో బ్రోవవా ॥జయ॥

పాపప్రచండా భవరోగభంజనా సద్భక్త ప్రియపాలనా !
కాచియుంటి కరుణతోడ కాపాడవా-నే
కాచియుంటి కరుణతోడ కాపాడవా ॥జయ॥

ముక్తివిని ఘనముగ వెలసిన శ్రీ సీతారామ గురూ !
సాధురూప సౌమ్యచరిత సన్మంగళం- ఓ
సాధురూప సౌమ్యచరిత సన్మంగళం ॥జయ॥

౧౦

జాగేలా గోపాలా హారతి గైకోరా !
నీలమేఘవర్ణా నిన్నే నమ్మితి ॥జాగేలా॥

నందగోపబాలా ! వందన మిదెవ
సుందర పాదారవిందంబులకు నే ॥జాగేలా॥

ముద్దు గోపబాలా మురళి చేకోరా !
కరమున మురళితో గానము సేయరా ! ॥జాగేలా॥
మల్లెమాలతీ మాలల్ గైకోరా !
పాలివిగో పండ్లివిగో ఆరగించరా ! ॥జాగేలా॥

చేతులలోని హారతులు క్రిందఉంచి, బారులు తీరి కూర్చొని, ఈ క్రింది శ్లోకములు, పద్యములు అనుసంధింపవలెను.

స్ఫురత్సహస్రార శిఖాతితీవ్రం
సుదర్శనం భాస్కరకోటి తుల్యమ్ ।
సురద్విషాం ప్రాణవినాశి- విష్ణోః
చక్రం సదాహం శరణం ప్రపద్యే ॥

విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య
యస్య ధ్వని ర్దానవ దర్పహంతా ।
తం పాంచజన్యం శశికోటి శుభ్రం
శంఖం సదాహం శరణం ప్రపద్యే ॥

హిరణ్మయీం మేరుసమానసారాం
కౌమోదకీం దైత్యకులైక హన్త్రీమ్ ।
వైకుంఠ వామాగ్ర కరాభిమృష్టాం
గదాం సదాహం శరణం ప్రపద్యే ॥

రక్షోఽసురాణాం కఠినోగ్ర కంఠ
చ్ఛేదక్షర చ్ఛోణిత దిగ్ధధారమ్ ।
తం నందకం నామ హరేః ప్రదీప్తం
ఖడ్గం సదాహం శరణం ప్రపద్యే ॥

యజ్జ్యానినాద శ్రవణాత్ సురాణాం
చేతాంసి నిర్ముక్తభయాని సద్యః ।
భవంతి దైత్యాశని బాణవర్షి
శార్ఙ్గం సదాహం శరణం ప్రపద్యే ॥

ఇమం హరేః పంచమహాయుధానాం
స్తవం పఠేత్ యోఽనుదినం ప్రభాతే।
సమస్త దుఃఖాని భయాని సద్యః
పాపాని నశ్యంతి సుఖాని సంతి ॥

వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
యదృచ్ఛయాపత్సు మహాభయేషు ।
ఇదం పఠన్ స్తోత్ర మనాకులాత్మా
సుఖీ భవేత్ తత్కృత సర్వరక్షః ॥

సశంఖచక్రం సగదాసిశార్ఙ్గం
పీతాంబరం కౌస్తుభవత్స చిహ్నమ్ ।
శ్రియా సమేతోజ్జ్వల శోభితాంగం
విష్ణుం సదాహం శరణం ప్రపద్యే ॥

జలే రక్షతు వారాహః స్థలే రక్షతు వామనః ।
అటవ్యాం నారసింహశ్చ సర్వతః పాతు కేశవః ॥

ఈ చిన్నపాపచే యిల భట్టనాథుండు
తులసీవనము ద్రవ్వ వెలసియుండె
ఈ ముద్దుగుమ్మచే యిట సూరివరులకు
పదుగురికిని ముద్దుపట్టె యయ్యో
ఈ మందయానచే తా ముందుగా దాల్చి
విరులదండలు హరికొరకొసంగె
ఈ ముద్దరాలచే యిచ్ఛచే తా గొల్ల
పడతియై కృష్ణానుభావ మందె

తగును శ్రీరంగభర్త యీ తరుణి కితని
కీ శుభాంగియు తగునని యింతు లనగ
భావమలరంగ వినియె సద్దేవి యనుచు
వాదిభీకరగురు డనె మోదమలర ॥

వీడచే రక్కసి విగతజీవగ జన్ను
బాలుద్రావిన మేటి బాలకుండు

ఈతడే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు
ఈతడే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీడు
ఈతడే యెలయించి వ్రేతల మానంబు
సూరలాడిన లోక సుందరుండు

ఈడు లేకున్న పుర మటవిస్థలంబు
ఈని పొందని జన్మంబు విగతఫలము
ఈని పలుకని వచనంబు విహగరుతము
ఈని చూడని చూడ్కులు వృథలు వృథలు ॥

చెలిసూ! గోపిక లీకుమార తిలకున్ జింతించుచున్ పాడుచున్
కలయంబల్లుచు నంటుచున్ నగుచు నాకర్షించుచున్ హస్తగా
మలక క్రీడకు దెచ్చి నిచ్చలును సమ్మానంబులన్ పొందగా
తొలిజన్మంబుల నేమినోచిరో కదే దుర్గ ప్రదేశంబులన్ !

ఈడడే తాటక పీరరణంబున
గీటడగించిన యేటుకాడు
ఇతడే కౌశిక క్రతురక్షను సుబాహు
బిలుకుమార్చిన యట్టి బిరుదులాడు
ఈడడే గౌతము వెలది శాపము మాన్పి
యింతిగా జేసిన యింతవ్వకాడు

ఇతఁడటే మనపెట్టిపతి దాచియున్న యా
ఉగ్రువిల్ విరచిన హాంతగాడు

ఈతఁడా నిన్న మనసీత నెలమి పెండ్లి
యాడి కులుకుచు నున్నట్టి యందగాడు
ఔర! యెంతటి పుణ్యాత్ముఁడమ్మ జనకు
డితఁడు తన కల్లుడై వేడ్క నెసగుటకును!

ఏమి నోచెనో కదే ఈతని సుతుగాఁగ
కౌసల్య కడుపార గాంచుటకును
ఏనిష్ఠ సలిపెనో మానినీ మనసీత
పతిగాఁగ నీతని బడయుటకును
ఏమి జపించెనో! ఈ మన జనకుండు
వీడిటు లల్లుడై వెలయుటకును
ఏతపంబుండిరో ఈత డేలికయయి
ఓమగా తమ్ము అయోధ్యజనులు

ఏమి నియమంబు జరిపెనో యింతులార
ప్రత్యహంబును శ్రీరామభద్రు కనుల
కరవు దీరంగ వీక్షింపగా నయోధ్య
జనము సత్క్షేత్ర తీర్థవాసంబు పొదలి ॥

మహిత వేదవ్యాస మహాని సాత్త్విక తపో
జనిత మహాసత్త్వమున చెలంగి

లక్ష్మీప్రపతిస్వామి వీక్షణామృత వృష్టి
తడిసి పునీతమై ధన్యత గని
బహుశతాబ్దులు మహాభక్తవర్యుల రామ
నామామృతంబున నాని నాని
స్వామి యతీంద్రుల సంకీర్తనామృత
వాహినీలహరుల బడి ద్రవించి

నట్టి ముక్తివియందు అధ్యాత్మశక్తి
పాదుకొనియుండి, జీర్ణించి, పరమపతిత
మూర్ఖులకు సైత మవలీల మోక్షమొసగ
జాలి, ముక్తివి యనుపేరు లీలతెల్ప
నహహా ! ఈపుణ్యభూమియం దమితప్రేమ
తలచి పాపుల రక్షించ వెలసినావు
భళిర ! కృష్ణాశ్రమనివాస ! భయనిరాస !
రమ్యగుణసాంద్ర ! పట్టాభిరామచంద్ర !

మొదలుగా తిరుమలసదనంబునను, రామ
చంద్రదార్య గురుసేవ లంది, పిదప
కూరిమి భక్తుడు పేరమరాజుకు
దత్తుడవై ప్రేమ హత్తుకొనగ
ధరను ముక్తివికి దయచేసి, దాసుల
వంశానుగతముగా చనుసదిరిగి

చివరకు యతివర్యుచే స్థాపితంబయి
నట్టి యాశ్రమమందు తిష్ఠవేసి
మాదు వంశీయులను నెల్ల మహితక్షేమ
నేలి రక్షించినాడవు నీరజాక్ష !
భళిర ! కృష్ణాశ్రమనివాస ! భయనిరాస !
రమ్యగుణసాంద్ర ! పట్టాభిరామచంద్ర !

వామాంకమున సీత మామాత కూర్చొని
చేతనోద్ధరణంబు చేయజెప్ప
మాత సన్నిధిలోన జోతతో హనుమన్న
భక్తిప్రపత్తుల యుక్తి దెలుప
వెనుకగా కుడివైపు వినయ ముట్టిపడంగ
సౌమిత్రి పసిడి ఛత్రమును బట్ట
వామపార్శ్వంబున భూమిజ వెనుకగా
భరతుండు పసిడిచామరము వీవ
కన్నుల కెదురుగా చిన్నితమ్ముడు నిల్చి
పరివారమునకెల్ల ప్రణుతిసేయ

వసుధ పట్టాభిషిక్తుడవై జగముల
కరుణచేతనె రక్షింప గడగినావు
భళిర ! కృష్ణాశ్రమనివాస ! భయనిరాస !
రమ్యగుణసాంద్ర ! పట్టాభిరామచంద్ర !

వసుధను మూర్తీవివంశ యశశ్చంద్రి
కలను జగద్వ్యాప్తిగా నొనర్ప

పెదతిరుమల పీడి పేదకుపెన్నిధి
కరణి ము త్తైవికి కదలివచ్చి
మా యిలువేల్పువై మాదు వంశీయుల
చేత పూజలనంది ప్రీతిబొంది
సంగీత సాహిత్య సకలవిద్యల నిచ్చి
సభలలో అసమాన జయము లిచ్చి
నీ అనుభవ మిచ్చి నీ దివ్యలీలల
జరిపించి పెక్కులు జగములెన్న

కంటికినిరెప్ప భంగిగా వెంటనంటి
కాచితివి కాచుచున్నావు కావగలవు
భళిర ! కృష్ణాశ్రమ నివాస ! భయనిరాస !
రమ్యగుణసాంద్ర ! పట్టాభిరామచంద్ర !

కోరిక లెడలించు ఓరిమిలేని నన్
కోపదృష్టుల చూడకుందువేని
శ్రీరామ ! ఒకకోర్కె చేరి మనవిచేతు
మరుమాటలేక నా మదికినిమ్ము
నీదు దాసుల ప్రేమ నేలుకొమ్మనిచెప్ప
నంతటి అవివేక మింతలేదు
నీ జాడ నమ్మక నేప్రొద్దు సంసార
కూపంబునన్ ద్రగ్గి కుమిలి కుమిలి

బాధ లందెడి యజ్ఞానపరుల కావ
ప్రార్థనముచేతు- ఏమి కారణ మనంగ,

నన్ను రక్షించు మని వారు నిన్నడుగరు
అడుగనిది నీవు రక్షింప నందువాయె-
ఎట్లు పొసగును ఇది మీర లిర్వురకును
కాన నే నిదె వారి పక్షాన నీకు
ప్రణుతి చేసితి రక్షింప పరమపురుష !
భళిర ! కృష్ణాశ్రమ నివాస ! భయనిరాస !
రమ్యగుణసాంద్ర ! పట్టాభిరామచంద్ర !

మానవులార ! రండొకటి మంచిరహస్యము చెప్పవచ్చితిన్
కాననివాని నూతగొని కాననివా డతిదుఃఖజాలముల్
వేనకువేలు పొందుగతి వేసటనొందక, కర్మబద్ధులై
దానవవైరి మాధవుని తద్దయు కీర్తన చేయుచుండుడీ !

తెలియని మానవుల్ మనల తేలికగా బహునీచభాషలన్
పలికిన పల్కుగాక, అవి పాటివహింపక కృష్ణనామ ని
స్తుల మధుపానమత్తతను తూలుచునృత్యమొనర్చుకొంద మే
అలజడిలేక, భక్తవరు లందరు రండు నమస్కరించెదన్ !

ధరణిగలట్టి భోగములు తద్దయు వాసవ స్వర్గసౌఖ్యముల్
అరయ విరించి వైభవము లాదిగ గల్గు సమస్తసంపదల్
తిరములుగావు, తుచ్ఛములు శ్రీహరినామసుఖంబుముందటన్
మఱువక నామకీర్తనము మానవులార సతంబు సల్పుడీ !

చామరసేవ : అందరును లేచి, వరుసగా నిలబడి, ఉన్నవారు చామరముతో, లేనివారు తులసిదళముతో గాని, పుష్పముతోగాని విసరుచుండవలెను :

ఇక్ష్వాకోహి మహాబాహుం రఘువీరం మహాబలమ్
గజేన మహతా యాంతం రామం ఛత్రావృతాననమ్;

తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ
పుండరీక విశాలాక్షౌ చీర కృష్ణాజి నాంబరౌ;

ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ
పుత్రౌ దశరథ స్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ;

తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే;

తాసా మావిరభూ చ్ఛౌరిః స్మయమాన ముఖాంబుజః
పీతాంబరధర స్స్రగ్వీ సాక్షా న్మన్మథ మన్మథః.

కరుణాకర నీవు సతంబును నీ
చరణాంబుజ దాసుని దాసునిగా
వరమున్ దయచేయవె మాధవ ! నిన్
శరణంటి పరాకుపడేవు సుమా !

ఉచితానుచితంబు లెఱుంగను నీ
కు చిరంబుగ దాసుడ నంటిని నీ
కుచితంబె యగున్ నను బ్రోవగ నీ
వు చిరాకు పరాకు పడేవు సుమా !

కనికారము లేకను నన్ విడనా
డినచో నిక నెవ్వరు నా ! తవ చిం
తన నెప్పుడు మానని నా విషయం
బున నీవు పరాకు పడేవు సుమా !

నిను జేరినవారిని బ్రోచు వ్రతం
బును బూనిన నీవె యిటుల్ దయ మా
లిన నాగతి యెవ్వరు నా విషయం
బున నీవు పరాకు పడేవుసుమా !

అదె నీ చరణాంబులె నే శరణం
టి దయాజలధే ! గతి నీవె కదే
పదదాసులమా మము బ్రోవగదే
యదునాథ ! పరాకు పడేవుసుమా !

కమలాసన వైభవ మైనను కో
రము నీ పదభక్తియె మాకెపుడున్
కమలాక్ష ! శ్రితావనదీక్ష ! సదా
మము బ్రోవ పరాకు పడేవుసుమా !

అపరాధ సహస్ర సహస్రములన్
విపరీతముగా నొనరించియు నీ
దు పదంబులపై బడితిన్ నను బ్రో
వ పరాకు చిరాకు పడేవుసుమా !

సనకాది మునీశ్వర సన్నుత పా
వన పాదయుగా ! సకలాధిపతే !
ఇనవంశపయోధి శశాంక ! విభో !
నను బ్రోవ పరాకు పడేవుసుమా !

నిను జూడబడే నిమిషంబులు కూ
డను నాకు యుగంబు లికన్ భరియిం
పను నే నసమర్థుడ నో వరదా !
నను బ్రోవ పరాకు పడేవుసుమా !

చామరములుగా ఉపయోగించిన పుష్పములు స్వామి సన్నిధిలో సమర్పించి, ఈ క్రింది శ్లోకములు అనుసంధింపవలెను :

సర్వదేశ దశా కాలే ష్వవ్యాహత పరాక్రమా
రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్.
రామానుజార్య దివ్యాజ్ఞా ప్రతివాసర ముజ్జ్వలా
దిగంత వ్యాపినీ భూయాత్ సాహి లోకహితైషిణీ.

శ్రీమన్ శ్రీరంగ! శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ!
శ్రీమన్ శ్రీరంగ! శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ!

అనంతరము తీర్థ ప్రసాద వినియోగము జరుగును. తీర్థప్రసాదవినియోగము పూర్తి అగువరకును, అందరును, కలిసంతరణ మహామంత్రమును స్వరములు కలిపి అనుసంధించుచుండవలెను.

"హరే! రామ! హరే! రామ!
రామ! రామ! హరే! హరే!
హరే! కృష్ణ! హరే! కృష్ణ!
కృష్ణ! కృష్ణ! హరే! హరే!"

స్వస్తి ప్రజాభ్యః!

